Registered No. M-4345.

# యుద్ధ సంచిక.

వాల్యూం I.] మద్రాసు : 1941 వ సం॥ సెప్టెంబరు నెల 5 వ తేది శుక్రవారం [నె 25 రు

## ఆయుధోత్పత్తి, ఎక్కువ ఉత్పత్తి, యింకా ఎక్కువ ఉత్పత్తి.

### యుద్ధం మూడోయేట సాధించవలసిన ఆదర్శం.

### రూజువెల్టు, ఈడెనుగార్ల హెచ్చరిక.

నేడు జరుగుతున్న రెండో ప్రపంచయుద్ధంలో మూడో యేడు యీనెల 3 వ తేదిన ప్రారంభమయినది. ఈ మూడో యేట సాధించవలసిన ఆదర్శం ఏమంటే అన్నిరకముల ఆయుధములు పరికరాలు ఎక్కువ ఉత్పత్తి చేయడం— తుపాకులు, ఫిరంగులు, టాంకులు, విమానాలు, నౌకలు అన్నీ ఎక్కువగ తయారుచేయాలి. యుద్ధం చేస్తున్న సైన్యాలకు కావలసిన ఆయుధాలు యివ్వకుంటే ఓటమి తప్పదు.

శనివారంనాడు బ్రిటిషు విదేశాంగ మంత్రి. ఈడెనుగారు ఒకచోట ఉపన్యసిస్తూ యీవిషయమే హెచ్చరించేరు: "యుద్ధంలో ఆయుధాలు లేకపోవడం చాల తప్పు. గత ఎండకాలమునందు ఫ్రాంసులో యుద్ధం జరిగినపుడు జర్మనీ సైన్యాలకున్న ఆయుధబలం విమానబలం, బ్రిటిషువారికి, వారి మిత్రులగు ఫ్రెంచి, బెల్జియంవారికి ఉండియున్నచో నేడు జర్మనీ యిట్లుండేదికాదు ; తూర్పున రష్యాతోబాటు పడమరను మిత్రమండలితోగూడ యుద్ధం చేస్తూయుండేది. ఆయుధ పరికరాలు ఎంత ఎక్కువగావుంటే యుద్ధంలో అంత లాభం. బ్రిటిషు సైన్యాలకు అంత ఎక్కువగా ఎప్పుడూ ఆయుధాలు లేవు. జర్మనీ సైన్యాలకుగల ఆయుధశక్తితో సరిసమానమైనది మన సైన్యాలకుగూడ ఉండేవరకు మనం సంతృప్తిచెందరాదు. మన సైన్యాలకే ఆ ఆయుధ సంపదవుంటే మంచి ఉపయోగం చేయగలరు."

### ఖిమానశక్తి పెంచందీ దాడి సలుపరాదు.

జర్మను సేనలతో అద్భుతంగా రష్యా సేనలు యీరోవు తూర్పుభాగమున యుద్ధం చేస్తున్నాయి కదా, యీ సమయాన జర్మనీకి పడమరను ఎసరుపెట్టుటకై బ్రిటిషు సేనలను జర్మనీపైకి పంపరాదాయని కొందరడుగవచ్చును. ఇంగ్లాండులో యిపుడు 30 లక్షల సైన్యం ఆయుధాలతో సిద్ధంగానున్న మాట నిజమే. అంతేకాక, ఆఫ్రికాలోని లిబియాలోతప్ప యింకెక్కడకూడా శత్రుసేనలను బ్రిటిషు సామ్రాజ్య సేనలు ప్రస్తుతం ఢీకొని యుండలేదనుటకూడా నిజమే. సంపూర్ణ విజయానికి జర్మనీపై నేలసైన్యాలను పంపి దాడి చేయడం కూడా అవసరమేకాని ప్రస్తుత సమయాన, యింకా విమాన శక్తియందు శత్రువుని మించందీ అట్టిదాడి ప్రారంభించుట హిట్లరువలలో పడుటేయగునని, నిపుణుడగు సర్ డగ్లసు బ్రౌనురిగుగారనిరి. నౌకా శక్తియందు అక్ష రాజ్యలను బ్రిటిషు ప్రభుత్వం మించియున్నదిగాని విమానశక్తియందు యింకా మించలేదు. "మన ముఖ్యకార్యమునకు భంగంలేకుండా ఎన్ని విమానాలను జర్మనీపైకి పంపగలమో అంతే పంపాలి. జర్మను విమానశక్తిని మించిపోవుటకు చేయుచున్న ప్రయత్నమునకు భిన్నంగా ఎక్కువ బాంబరు విమానాలను జర్మనీపై పంపుట ఘోరమైన పొరబాటగును" అని సర్ డగ్లసుగారనిరి. మరియు, రష్యనులు జర్మనులదాడి నెదుర్కొని ధైర్యంగా పోరాడుచు శత్రువుకి పనికల్పించి మనకు తోడ్పడుచున్నపుడే, మనం వీలయినంత ఎక్కువగ ఆయుధాలను తయారుచేసి, సైన్యాలను ఆఖరు తెంపు యుద్ధానికి సిద్ధం చేయవలెను. విమానదాడులందు బ్రిటిషువారే ముందంజ వేయుచున్నారు. యుద్ధానికి అవసరమగు పరికరాలు, సర్వశక్తులు సిద్ధంగాయుంటేగాని, శత్రువుపై దాడి జరుపరాదు. "నాజీలు రష్యాతో యుద్ధంలోదిగి దృష్టినటు మరల్చియున్న సమయమునందే మనం ఆయుధోత్పత్తి ఎక్కువచేయాలి. బ్రిటిషు విమానాలు రష్యా విమానాలతోకలసి జర్మనీపై బాంబులు వేస్తూవుంటే తట్టుకోలేక జర్మనులు భీరువులై పోయినపుడు, జర్మనీ ఆక్రమించిన దేశాలలో అన్నింట కుట్రలుసాగి జర్మను సైన్యాల వెనుక గోతులు తవ్వి కూలద్రోస్తున్నపుడు, బ్రిటిషు సామ్రాజ్యసైన్యం జర్మను మధ్య భాగంవరకు పోయి గెలువగలదుగాని, యీలోగా దాడిచేయుట మంచిదికాదు." అని సర్ డగ్లసుగారనిరి.

### ఆఫ్రికాలో రక్షణలు.

ఉత్తర ఆఫ్రికాయందు జర్మను సైనిక సమీకరణం యెక్కువగుచున్నది. స్వతంత్ర ఫ్రాంసుకు చెందిన పడమర ఆఫ్రికా తీరమునందున్న డేకరు యిపుడు చాల శ్రద్ధగ కాపాడబడుచున్నది. లిబియాలో సైనిక శిబిరాలందుగూడ శక్తి యెక్కువచేయబడినది. శత్రువు స్పెయినుమీదుగా ఒక దళమును, దానికి తూర్పున కొంత దూరంలోనున్న టునీషియామీదుగా యింకో సైనికా దళమును ఆఫ్రికామీదకు ఒకేసారి పంపవచ్చును. ఈ రెండింటి మధ్యనుంచి మన సైన్యాలను అడకత్తెరిలోపెట్టి నొక్కినట్లు నొక్కాలని ప్రయత్నించవచ్చును. యుద్ధం క్రొత్త రంగాలకుకూడ ప్రాకవచ్చునని గతవారం చర్చిలు ప్రధాని సూచించిన క్రొత్త రంగం యిదే కావచ్చు. అందుకనే బ్రిటిషు విదేశాంగ మంత్రియగు అంతోని యీడెనుగారును, అమెరికా అధ్యక్షుడగు రూజువెల్టుగారునుకూడ ఆయుధోత్పత్తి యెక్కువ చేయవలసిన అవసరంగూర్చి నొక్కి చెప్పేరు. "రాయలు విమాన దళమునకు యెన్ని విమానాలు అవసరమో అన్ని యివ్వబట్టి వారు అద్భుతంగా పనిచేసిరి. నేల సైన్యానికిగూడ కావలసిన పరికరాలన్ని యిస్తే వారూ అట్లే చేతురు. ఆయుధాల వుత్పత్తియే విజయసాధనం." అని ఈడెనుగారన్నారు. మిత్రమండలి దేశాలు తయారుచేస్తున్న వాటిని, అమెరికాసంయుక్తరాష్ట్రములు పంపుచున్న వాటిని, కలిపినా ఆయుధాలు యెన్ని కావాలో అన్ని లేవు. యుద్ధం యింకా క్రొత్త ప్రదేశాలకు వ్యాపించినకొలదీ యీ అవసరం యెక్కువవుతూవుంటుంది. కావున ఆయుధాల వుత్పత్తి యెంతేనా యెక్కువ చేయాలి. అదన్నీ వడిగా జరగాలి.

## అధ్యక్షుడు రూజువెల్టు హెచ్చరిక.

అమెరికా అధ్యక్షుడు సెప్టంబరు 1 వ తేదిన తమ దేశంలో కార్మికోత్సవంనాడు ఉపన్యాసిస్తూ యీ విషయమే హెచ్చరించెను. "అన్ని యుద్ధాలకన్న ఘోరమైన యుద్ధం నేటి యుద్ధం. దీన్ని గెలుచుటయందు అమెరికా కార్మికులపై యెక్కువ బాధ్యతగలదు. మన శస్త్రాగారాలలో, ఫ్యాక్టరీలలో క్రొత్త రకాల ఆయుధాలు అత్యంత అధికంగా అమితవేగంగా తయారవుతున్నాయి.

మనం యుద్ధప్రియులముకాము. మన దేశంలో యుద్ధం జరగడంలేదు. అయితే ఎందుకిట్లా తయారుచేస్తున్నామంటే, హిట్లరు ప్రపంచాన్నంతా పరిపాలించాలన్న ఆశతో అన్ని దేశాల ప్రజల హక్కులను నాశనంచేస్తున్నాడు. కార్మికుల హక్కులుగూడ పోతున్నాయి. ఈ హక్కులను కాపాడుటకే మనపూర్వీకులు ఎంతో త్యాగంచేసిరి. ఈ దేశంలోను, యితర దేశాలలోను సముద్రాలపైనాగూడ యుద్ధంచేసి, గెలిచి, యీ హక్కులను కాపాడిరి. అన్ని జాతుల అన్ని తెగలవారి హక్కులకు అన్యోన్య సంబంధముగలదు. మన సైన్యశక్తి నానాటికి హెచ్చుతున్నదని శత్రువులు ఎరుంగుదురు. మన నౌకాదళశక్తిగూడ హెచ్చుతున్నదని శత్రువులెరుంగుదురు. మన నౌకా శక్తిన్నీ, బ్రిటిషు సామ్రాజ్యము, హాలెండు, నార్వే రషియా దేశముల నౌకా శక్తులన్ని కలసి సముద్ర మార్గాలను కాపాడగలవని శత్రువులెరుంగుదురు. ఇతర దేశాల నౌకాశక్తి లేకున్నచో అమెరికా నౌకాశక్తి మాత్రం అన్ని సముద్రాలను రక్షింపజాలదనియు శత్రువుకి తెలుసును. కావున అమెరికా పరిశ్రమలలో యజమానులును కార్మికులునుకూడా చాల శ్రమపడి ఆయుధాలను ఎక్కువగ తయారుచేసి యుద్ధరంగాలకు భద్రంగా చేరేటట్లు చూడకపోతే, శత్రువులు మరింత ధైర్యం చెంది క్రొత్త దేశాలమీదికిగూడ దాడి రాగలరు." అని రూజువెల్టుగారనిరి.

### హిట్లరుగెలిస్తే కార్మికుల దుస్థితి.

హిట్లరు విజయంవలన కార్మికులకు ఎటువంటి ప్రమాదం కలదో గూడ రూజువెల్టుగారు తెలిపిరి. అటువంటి దురదృష్టమేపడితే కార్మిక సంఘములన్నియు మందులోకైనా ఉండవు. కార్మిక సఖ్యత అన్నది నిషేధింపబడును. కార్మికులు ప్రజలు స్వతంత్రించి మాట్లాడడం, అందరుకలిసి ఆలోచించుకోడం డిక్టేటరులకు యిష్టముండదనిరి.

బ్రిటిషు ప్రభుత్వంవారు పిలువగ జాను డి. బిగ్గర్సుగారు త్వరలో ఇంగ్లాండు పోతున్నారు. ఇతడు అమెరికాలో ఆయుధోత్పత్తి శాఖాధికారియగు డైరక్టరు. ఇంగ్లాండులో తయారయే వస్తువులకు అమెరికాలో తయారయే వస్తువులకు పోటీలేకుండా సమన్వయించే యేర్పాటు వీరు చేస్తారు. ఉత్పత్తి ఎలాగ ఎక్కువచేయడమో తెలుసుకోడానికి అమెరికా నిపుణులతో సంప్రదించడానికి ఇంగ్లాండునుండి కొందరు ఉద్యోగులు అమెరికాకు పోతారు. యుద్ధరంగాలకు ఆయుధాలు పంపడానికని అమెరికాలో ప్రజలుకూడా తమకు కావలసిన కొన్ని వస్తువులను తయారుచేసుకొనుట మానుకోవాలి. కార్మికులుకూడ సౌకర్యాలు కొన్ని వదలుకోవాలి. ఉత్పత్తి, ఎక్కువ ఉత్పత్తి, ఇంకా ఎక్కువ ఉత్పత్తే యుద్ధంలో విజయసాధనమని అందరు గుర్తిస్తున్నారు.

# రెండవ యుద్ధ వార్షిక దినము.

### రాజప్రతినిధిగారి రేడియో ఉపన్యాసము.

సెప్టంబరు 3 వ తేది రాత్రి రెండవ యుద్ధ వార్షిక సందర్భములో రాజ ప్రతినిధి లిన్‌లిత్‌గో ప్రభువుగారు సిమ్లానుండి రేడియోలో ఉపన్యసించినారు. ఆ ఉపన్యాసములో వారు రెండు విషయములను గురించి చెప్పినారు. (1) భారతదేశముయొక్క కర్తవ్యము. (2) రాబోవు ఆదివారము రోజు దేశమంతట ప్రజలు మిత్రమండలి వారి విజయమునకై దైవప్రార్థనలు జరుపుట.

భారతీయుల కర్తవ్యమును వివరించుచు భారత సైన్యాలు—కాల్బలములు, నావికులు, వైమానికులు—వివిధ యుద్ధరంగాలలో గొప్ప ధైర్య సాహసములతో పోరాడి, జయము పొంది కీర్తి సంపాదించుకొన్నారని, దేశములోని ప్రజలందరు స్త్రీలు, పురుషులు, ప్రభువులు పేదలు సకల శాఖలలోని ఉద్యోగులును కత్తులు, కఠారులు పుచ్చుకొని రణరంగమునకు పోకపోయినా దేశములోనే ఇతర యుద్ధ ప్రయత్నములకు సాయపడి దేశసేవ చేయుచున్నారని చెప్పిరి. ఆఫ్రికా ఖండములోను, ఇరాక్, పెర్షియా, సిరియా దేశములలోను భారత సైన్యములు చేసిన ఘనకార్యాలను ప్రశంసించి వారు ఇటలీ సామ్రాజ్యాన్ని ధ్వంసంచేసినారని పొగిడారు. వీరు యింకను చేయవలసినది, చేయకలిగినది యెంతో ఉన్నదనిన్ని, ద్రవ్య సహాయమును, మరి యితర విధముల చేయగలిగిన సహాయమును, ఇప్పుడు చేసినదానికంటె రెండింతలుగా చేయవలసిందని వారు కోరినారు. దేశంలో యుద్ధ వ్యతిరేకులైన పంచమదళమువారు (గూఢచారులు) చేయు కుట్రలకు ఏమాత్రము లోబడకూడదని హెచ్చరించారు.

వచ్చే ఆదివారము మిత్రమండలివారు నాజీ పిశాచాన్ని రూపుమాపి జయము పొందడానికిగాను దేశమంతట ప్రజలు దైవప్రార్థనలు జరుపవలెనని వారి కోరికయైయున్నది. యుద్ధకాండలో ఇక సగముకూడ కాలేదనిన్ని దేవునిమీద భారము వేసి ధైర్యసాహసాలు, ఓర్పు, పట్టుదలకలిగి పోరాడినయెడల జయము పొందవచ్చునని వారు సెలవిచ్చారు. "ఇండియా దేశము ఎంతయూ జాగ్రత్తగానున్నది; ఇండియా బలము మహత్తరముగానున్నది. మీరు తలపెట్టినట్టైతే ఆ బలము బ్రహ్మాండముగా విస్తరిస్తుంది" అని చెప్పి ప్రజలు తాము చేయకలిగిన సహాయన్నంత చేయవలసినదని, వచ్చే ఆదివారము దేశమంతటను ప్రార్థనలు చేయవలసినదని విన్నవించారు.

### కమాండర్-ఇన్-చీఫ్ (సర్వసేనాని) గారి ఉపన్యాసము.

రేడియోలో మాట్లాడుచూ కమాండర్-ఇన్-చీఫ్ గారు నాజీలు నిష్కారణముగాను క్రూరముగాను ప్రపంచముమీద పడి కబళించడానికి ఈ యుద్ధము ప్రారంభించుటచే, బ్రిటిషువారు స్వాతంత్ర్యమును నాగరికతను కాపాడు నిమిత్తము యుద్ధములోనికి దిగవలసివచ్చుటను వివరించారు. గత సంవత్సరములో అకస్మాత్తుగా యుద్ధము రావడమువల్ల బ్రిటిషువారికి కొంత నష్టము కలిగినప్పటికిని క్రమేణ బ్రిటిషుపై జర్మనువారు దాడి సాగించుటకు వీలులేకుండ చేయబడినదనిన్ని, మధ్య ప్రాచ్యములో భయంకరముగానున్న పరిస్థితి మారి ఇప్పుడు అచ్చటను ఆఫ్రికాలోను బ్రిటిషువారిదే పైచెయ్యి అయినదనిన్ని, రష్యామీద యుద్ధము తీవ్రముగానున్నప్పటికినీ శీతకాలములో చల్లబడిపోతుందనిన్ని, గూఢచారుల (పంచమ దళమువారి) కుతంత్రాలు కూలిపోయినవనిన్ని, గత సంవత్సరము అమెరికానుండి యుద్ధ పరికరాల సరఫరా చక్కగా జరుగకుండినప్పటికిని ఆ సరఫరాలు ఇప్పుడు చక్కగా జరుగుటకు అదను కలిగిందనిన్ని, అమెరికావారును

బ్రిటిషువారితో చేతులుకలిపి జపానీయుల దురాక్రమణ విధానాన్ని అణచుటకు చర్య జరుపుతూ ఉన్నారనిన్ని సెలవిచ్చినారు. ఇండియాలోని యుద్ధ ప్రయత్నాలను గురించి చెప్పుచూ ఇప్పుడు బయటి దేశములలో ఒక లక్షకుపైగా భారతీయ సైన్యములున్నాయని, అవి ఆఫ్రికాలోను, సిరియాలోను పోరాడి ఖ్యాతిగాంచినవని, ఇండియా నౌకాదళము చక్కని నౌకాదళముగా ఏర్పడినదని, ఇండియా నావికులు నౌకా యుద్ధములో చక్కని తెలివి కనబరచుచున్నారని, విమానదళము క్రమేణ వృద్ధియగుచున్నదని చెప్పినారు. యుద్ధ ఆయుధాలుగూడను అపరిమితముగా ఇచట కర్మాగారములలో తయారగుచున్నవని పలికినారు. ఇట్లు విదేశ యుద్ధరంగములందు ఇండియా సైనికులు చేసిన సహాయములను వారు ప్రశంసించి తూర్పునగూడ జపానువారు దక్షిణమునకు చొచ్చుకొనిపోకుండ మలయాలోను బర్మాలోను ఉండు భారత సైన్యములు అడ్డుపడతాయని చెప్పినారు. కులమత భేదములు లేకుండ ఎల్లవారును యుద్ధములో సహాయపడవలెనని, సంఘీభవించి దేశీయులందరు పనిచేసినయెడల ఈ దేశము సురక్షితముగా ఉండి శాంతి సుఖముల ననుభవించునని చెప్పిరి.

# ఇరాను ఆక్రమణకు సైనిక నైతిక కారణములు.

## నిరోధం తొలగి యుద్ధం ముగిసింది.

## ముస్లిము రాజ్యాలయెడ బ్రిటిషువారి ఔదార్యం.

ఇరాను (పెర్షియా)లో బ్రిటిషు సేనలు రషియా సేనలు ప్రవేశించిన విషయం గతవారం తెలుపబడెను. ఇరాను రాజసషా తన సైన్యములకు యుద్ధమును విరమించునట్లును తుపాకులను ప్రేల్చకూడదనియు చేసిన ఉత్తరువు ననుసరించియు ఇపుడు రషియా బ్రిటనులు ఇరాను ప్రభుత్వంతో జరుపుచున్న రాయబారాల ననుసరించియు రషియా సేనలు యింకాముందుకు పోవుట మానినవి. ఇంతవరకు రష్యా సేనలు ఇరానులో టర్కీ సరిహద్దు చేరువగనున్న ఉర్మియా నగరాన్ని ఊర్మియా సరస్సుకి తూర్పుగనున్న మరాఘపురమును, దానికింకను తూర్పునయున్న మియానే పురమును పట్టుకొన్నవి. దక్షిణమునుండి ప్రవేశించిన బ్రిటిషు సేనలు ఉత్తరమునుండివచ్చిన రషియా సేనలను కలుసుకోగల్గినవి. రషియా బ్రిటనులకు ఇరాను ప్రభుత్వమునకు ఒడంబడిక కుదిరెనని చెపుతున్నారు. కాని షరతులు యింకా ప్రకటింపబడలేదు. ఇకముందు నాజీ జర్మనులకు ఇరానులో యెటువంటి తావు వుండకుండునట్లు యీ షరతులు నిర్ణయింపబడును.

రషియాకుగాని ఇగ్లాండుకుగాని ఇరానులో రాజ్యాక్రమణ కాంక్షలేదని ఘట్టిగా చెప్పవచ్చును. ఈ విషయమున యెట్టి సందేహంలేదు. బ్రిటిషు విదేశాంగమంత్రి అంతోని ఈడెనుగారు యీ వారం ఉపన్యసించినపుడు ఇరాను ఆక్రమణకు కారణాలు తెల్పుచు యిట్లు చెప్పిరి. "ఇరాను దేశంలో అంగుళం మేరయినా మాకు అక్కరలేదు. మా రషియా మిత్రులకుగూడ అట్టి ఆశలేదు. ఇరాను రాజకీయ స్వాతంత్రమును సరిహద్దులను కాపాడెదమని ఇరాను ప్రభుత్వమునకు ఎన్నోసారులు నమ్మబలికితిమి. మా మిత్రరాజ్యమగు టర్కీకిన్నీ చేరువనున్న యితర దేశముల ప్రభుత్వములకుగూడ అట్టే భరసా యిచ్చియుంటిమి. సైనికావసరములు తీరిన వెంటనే ఇరానునుండి మా సేనలను తీసివేయుదుము. మా సైన్యాలకువలెనే ఇరాను ప్రజలకుగూడ ఆహారపదార్థములను పంపెదము. వారికెట్టి సౌకర్యములుండాలో అవన్నీ చేకూర్చెదము. యికముందు వారూ మేము కలసి పనిచేయగలమని ఆశించుచున్నాము."

### సైనిక కారణాలు.

మధ్యప్రాచ్యదేశములు, రషియా, ఇండియాలకు మధ్యగానున్న ఇరాను శరీరంలో నాభిస్థానంవంటిది. ఈ ప్రాంతాల రక్షణ విధానమునకు యిది కేంద్రము. నాజీలుకాని ఆ దేశాన్ని ఆక్రమిస్తే పామిరు పర్వతములమీదుగా విమానాలను పంపి అఫ్గనిస్తానమునకు ఇండియాకు ఉత్తర సరిహద్దులందున్న టిబెటు, సికియాంగులవరకుగూడ హాని కలుగచేయగలరు. పశిఫికు సముద్రమునందున్న ఆస్ట్రేలియా, న్యూజిలండులకు పాయు నౌకా మార్గాలనుగూడ నిరోధించగలరు. ఇరాకు, పెర్షియా, బెహరానులందలి చమురుగనులు ఆక్రమించి 16,000,000 టన్నుల చమురు తీసుకొనియుందురు. అందుకే నెమ్మదిగా రహస్యంగా పెర్షియా పీకను నులిపివేయాలని జర్మనులు ప్రయత్నించిరి. ఇంక కొంచెమాలస్యమైనచో ఆపని పూర్తి అయేది. ఇండియా, ఇరాకు, సిరియా, ట్రాంసుజార్డానియా, అఫ్గనిస్తానం, చివరకు ఆరేబియా మున్నగు ముస్లిము రాజ్యాలన్నీ చిత్తుపప్పయిపోయెడివి. తురుష్క రాజ్యాలన్నింటిలో నాజీ సైన్యాలుండేవి. ఇట్టి ప్రమాదం మీదపడుతూవుంటే ఇంగ్లాండు యేమిచేయవలసియుండెను? నిష్పాక్షికంగా ఆలోచించండి తెలుస్తుంది. ఇరానులో ఇంగ్లాండు చర్యను విమర్శించేవారే అబిసీనియా ఆల్బేనియాలకు ఇంగ్లాడు సహాయం చేయలేదని వెక్కిరిస్తారు. కాని, శత్రుదాడికి గురికానున్న దేశాలకు సహాయం చేయడమంటే, శత్రువుకన్న ముందు మనం సైన్యాలను పంపి ఆక్రమించడమేనని వీరు మరచిపోతారు. ఇపుడు సమయానికి ఇంగ్లాండు యీ రీతిగ ముందంజవేసియుండకపోయినచో, జర్మనులే ముందుగా పెర్షియాను వశపరచుకొనియున్నచో, ఇంగ్లాండు యెప్పుడూ ఆలస్యంచేస్తుందని నిందించియుందురు.

### నైతిక విజయం

నాజీతత్వం నాగరికతకే గొడ్డలిపెట్టువంటిది. కొద్దిమంది అధికారులు పెక్కుమందిని నిర్దాక్షిణ్యంగా అతిక్రౌర్యంగా పరిపాలించే ప్రాచీనకాల పరిస్థితులు వారు తెచ్చిపెడతారు. "ఓడినదేశాల ప్రజలు జర్మనువీరులకు బానిసలుగా వుండాలి" అని జర్మనుమంత్రి డేరిగారు బాహాటంగా చాటేరు. అట్లాంటిక్పుడు, స్వాతంత్ర్యప్రజాప్రతినిధి ప్రభుత్వం కోరేవారంతా నాజీ యెక్కడ తలయెత్తుతే అక్కడ అణచివేయాలి. నాజీలు మానవకోటికి శత్రువులగు రాక్షసులవంటివారని అందరంగీకరించియున్నారు. అట్టిచో పెర్షియాను బ్రిటిషువారు కాపాడడం నైతికంగా న్యాయమే.

మధ్యప్రాచ్యమునందు ముస్లీము రాజ్యాలతో సరిసమానమగు హెూదాతో సఖ్యతగనుండాలనే, బ్రిటిషువారు మొదటినుండీ ఆశించుచున్నారుగాని వాటిని అణచియుంచాలనికాదు. అందుకు పెర్షియావే నిదర్శనం. గత యుద్ధానంతరం బ్రిటిషువారు ఆక్రమించిన ప్రదేశాలనుండి బ్రిటిషు సైన్యాలను తీసివేయవలసిన అవసరం ఏమీలేకుండెను. అయినాకూడ ఒక్క సైనికునైనా పెర్షియాలోనుంచక తమంత తామే సైన్యం తీసివేసి పెర్షియనులు స్వయంగా పరిపాలించుకొనే అవకాశం కలుగజేసిరి.

### ఇతర ముస్లిము రాజ్యాలు.

ఇరాకు దేశాన్ని బ్రిటిషువారు తమ క్రింద నుంచుకొనుటకు అంతర్జాతీయ సమ్మతిగలదు, సైనిక బలంకూడాగలదు. అయినా 1932 వ సం॥లో ఇరాకుయొక్క స్వాతంత్ర్యం

హక్కును గుర్తించి, జాతిసమితిలో స్వతంత్ర సభ్యునిగ బ్రిటను చేసెను. తమ మాండేటరీ పరిపాలన క్రింద ఇరాకు ఉన్నపుడు బ్రిటిషువారు సైన్యాభివృద్ధి, వర్తక వాణిజ్యాభివృద్ధి సంపదాభివృద్ధి కలుగజేసిరి. తమ దేశంనుండి డబ్బుతెచ్చి ఇరాకులో ఖర్చుపెట్టిరి. ఇప్పటికిని సామ్రాజ్యపు ఇంజనీరులే ఇరాకులో 350 మైళ్ళ రోడును నిర్మిస్తున్నారు. దీనిని పూర్తిచేసి ఉచితంగా ఇరాకు ప్రభుత్వానికి ఇయ్యదలచిరి.

గత మాసంలోనే ఇరాకులోని రషీదాలి తిరుగుబాటును బ్రిటిషువారు అణచివేసి, సక్రమ ప్రభుత్వానికి తోడ్పడిరి. దానికి బదులుగా అదివరకున్న ఒడంబడిక షరతులనే అమలు జరుపగోరిరి కాని ఎక్కువేమి కోరలేదు.

ట్రాన్సుజోర్డానియాలోను అమీరు అబ్దుల్లా ప్రభుత్వానికిగూడ అట్లే తోడ్పడిరి. జాతి సమితి ఒప్పుకుంటే 1925 వ సం॥నందే ట్రాన్సు జోర్డానియా స్వాతంత్ర్యం గుర్తించుటకంగీకరించిరి. 1928 వ సం॥ ఫిబ్రవరి 20 వ తేదిన జెరూసలంలో ఆ ప్రకారం ఒడంబడిక సంతకంచేసి, 1939 వ సం॥ అక్టోబరులో దానిని దృఢపరచిరి. అందుకే, పాలకుడగు అమీరు యీ యుద్ధంలో బ్రిటిషువారికి సహాయంచేస్తానని ప్రకటించి, అవసరమయితే యుద్ధరంగమునందు బ్రిటిషు మిత్రుల రక్తంతోబాటు అరబ్బుల రక్తంకూడ ప్రవహిస్తుందని చెప్పిరి.

ఈజిప్టు అదివరకు టర్కీ సామ్రాజ్యంలో భాగంగానుండెను. 1914 వ సం॥న బ్రిటిషువారి సామంతరాజ్యమయ్యెను. బ్రిటిషువారు సుల్తాను ఫాడుగారిని ఈజిప్టు రాజుగచేసి 1922 వ సం॥ మార్చి 15 వ తేదిన ఈజిప్టుకి స్వాతంత్ర్యమొసంగిరి. 1936 లో ఇంగ్లాండు ఈజిప్టుతో 20 సంవత్సరముల సంధిచేసుకొని, ఈజిప్టులోని బ్రిటిషు సైన్యం తొలగించెను. కాని సూయజు కాల్వ కాపాడుటకు ఈజిప్టు సైన్యం తగినబలం చేకూర్చుకొను వరకు, బ్రిటిషు సైన్యం ఆ ప్రాంతాలనుండుటకును, అందువలన ఈజిప్టు స్వాతంత్ర్యానికి ఎట్టి భంగం రాకుండుటకును, యేర్పాటుచేయబడెను.

అరబ్బుదేశాలకు ఇంగ్లాండుకు సఖ్యతలేదని చెప్పేవారు పాలస్తీనా యందలి చిక్కులను ఎత్తిచూపుచుందురు. పాలస్తీనాలో అరబ్బుల అశాంతికి ఆందోళనకు కారకులెవ్వరు? జర్మనులే. జర్మనీలో నాజీపరిపాలకులు యూదులను తరిమివేస్తూవుంటే వారు అధికంగా పాలస్తీనా చేరుచుండిరి. 1931 లో 4,075 మంది యూదులు పాలస్తీనా చేరగా 1934 లో 42,359 మంది, 1936 లో 61,856 చేరిరి. వీరంతా జర్మనీ తరిమివేస్తే వచ్చినవారే.

పాలస్తీనాను మాండేటురాజ్యంగా పరిపాలించవలసిన బాధ్యత జాతిసమితిద్వారా ఇంగ్లాండుకి సంక్రమించుటచే, యూదులకు అరబ్బులకు ఉభయులకు సంతృప్తికరంగా నుండునట్లు పరిష్కరింప బ్రిటిషువారు చాల ప్రయత్నించిరి. అరబ్బులభయం పోగొట్టుటకై, పాలస్తీనా యూదుల రాజ్యంగా ఎంతమాత్రం చేయమని 1939 లోనే బ్రిటిషు ప్రభుత్వంవారు ప్రకటించిరి. తరిమివేయబడి డాన్యూబునదిలో పడవలలో అల్లాడుచున్న యూదులకు పాలస్తీనాలో ఆశ్రయమిస్తారాయని కామన్సుసభలో 1940 వ సం॥ ఫిబ్రవరి మాసంలో అడుగగా, "యివ్వము" అని ఘట్టిగా మంత్రి మాగ్డనాల్డుగారు తెలిపిరి.

ముస్లిము రాజ్యాలన్నిగూడ బ్రిటిషు ప్రభుత్వానికి స్నేహంగానే వున్నవి.

# మదరాసు గవర్నరుగారి ఉపన్యాసం.

### "అంతుకనబడకున్నా యుద్ధం ముగిసేస్థితికి వచ్చింది"

### "వదంతులను నమ్మకండి. బ్రిటిషు రేడియోనే వినండి."

"జర్మనులు రషియాపై ఎపుడు యుద్ధం ప్రారంభించిరో ఆనాడే వారిదశ తిరిగిపోయింది. యుద్ధం ముగియడానికి యింకా చాలకాలం పట్టవచ్చును. అంతు అగుపడక పోవచ్చును. అయినా ముగిసేస్థితికి వచ్చిందని నేను నమ్ముచున్నాను. బ్రిటిషు సామ్రాజ్యంలో అన్ని ప్రాంతాలవారు అన్నిపార్టీలవారు యుద్ధంలో జయించాలను ధృఢసంకల్పం కలిగియున్నారు. విజయం మనకు తప్పదు."

అని మదరాసు గవర్నరు సర్ ఆర్థరు హోపుగారు 3 వ తేదీ సాయంకాలం మదరాసులో జరిగిన రెండవ యుద్ధం సభయం దుపన్యసించుచు తెలిపిరి. వారింకను యిట్లు చెలిపిరి :

"1939 సెప్టంబరు 3 వ తేదీన ఒకవ్యక్తి దురాశచే ప్రపంచాన్నంతా యుద్ధంలో దింపినందున, ప్రపంచ నాగరికతా స్వేచ్ఛ కాపాడుటకు ఇంగ్లాండు ఫ్రాంసులు జర్మనీపై ఆనాడు యుద్ధం ప్రకటింపవలసివచ్చెను. ఈ యుద్ధకారణాలగూర్చి తెలియక అనేకవిధముల అనుకుంటారు. ఒక సామ్రాజ్యాధికారులు రాజ్యకాంక్షతో ఇంకో సామ్రాజ్యాధికారులపై యుద్ధంచేస్తున్నారనియు, నాగరికత కెట్టిప్రమాదం లేదనియు అనుకొనుట చాల పొరబాటు. హిట్లరును అతని మతాను యెదుర్కోవలసివచ్చింది కనుక యుద్ధం ప్రారంభించినాము. యుద్ధం ప్రారంభంకాకుండ జేయుటకే ఇంగ్లాండు ఎంతో ప్రయత్నించి తప్పనిసరియైనందున, యుద్ధంలో దిగెను. తీరా దిగింది కనుక యిపుడు జయింపక తప్పదు. జయించుటకు సర్వశక్తులు వినియోగించుచున్నది. తప్పక జయించును."

రెండేండ్లలో జరిగిన యుద్ధక్రమమును వర్ణించుచు గవర్నరుగారు, "ఆఫ్రికాలో బ్రిటిషు సేనలు చాల గొప్ప విజయమును అతి తక్కువ నష్టంతో బడయగల్గినవి. అదంతా భారతీయ సేనలచట చాల ధైర్యంగా పోరాడి సంపాదించిన విజయమే," అని చెప్పిరి.

జర్మనీకి తూర్పు దేశాలపై దండెత్తాలని ఆశగానుంది. ఇండియాకు రావాలని కాంక్ష గలదు. ఇరాకు, ఇరాను, అఫ్ఘనిస్తానులమీదుగా వచ్చుటకు వీలులేదు. గనుక ముందుగా రషియా నోడిస్తేగాని తూర్పు దాడి సాగదనితలంచి హిట్లరు రషియా యుద్ధం ప్రారంభించెను. జర్మనీ అన్ని దేశాలను ఒకేసారి ఎదిరించుచున్నది. ఇంగ్లాండు యింకను విశేష నౌకాబలంకలిగి సముద్రాధిపత్యం వహించియున్నది. అమెరికాయొక్క పరిశ్రమలన్నియు ఇంగ్లాండునకు తోడ్పడుచున్నవి. అనేకశక్తులు జర్మనీని ఒకేసారి యెదిరించుచున్నందున జర్మనీ ఓడిపోవక తప్పదు. ఎన్నాళ్లలో అన్నదే సందేహం.

## భారతీయులకు హెచ్చరిక.

భారతీయులంతా యుద్ధం యెందుకు జరుగుచున్నదో నిజం తెలుసుకోవాలి. ఇపుడు ఇండియాకు యుద్ధం మరీ చేరువైందని గుర్తించాలి. ఇరాన్నే జర్మనీ ఆక్రమించియున్నచో ఇండియా ద్వారంవద్దకే జర్మను సేనలు వచ్చినవన్నమాట. అయితే, ఇంత చేరువగా యుద్ధం వస్తున్నపుడు భారతీయ సేనలను ఇండియాలోనుంచక దూరాన ఆఫ్రికా, సిరియా, ఇరాకులకు ఏల పంపుచున్నారని కొందరడుగుచుందురు. అది తెలివితక్కువప్రశ్న. ఇండియా రక్షణ ఇండియా సముద్రతీరాలందు, సరిహద్దులందే జరుగవలసిందికాదు. ఆఫ్రి

“ బర్మా ” స్క్వాడ్రనుకు జెందిన వైమానికులను ఈ పటములో చూడవచ్చును.



ధైర్యసాహసములతోకూడిన ఫైటర్ స్క్వాడ్రనును ఇచ్చినందుకు ఇంగ్లాండు బర్మాను అభినందించుచున్నది.

రాయల్ విమానదళములో కమిషను నియ్యబడిన మొదటి బర్మాదేశస్థుడు, బ్రిటిషు రాయల్ విమానదళము ఫైటర్ కమాండుయొక్క బర్మా స్క్వాడ్రనులో ఇంజనీరు ఆఫీసరుగా నున్నారు. బర్మాదేశ మొసగిన 150,000 పౌనుల విరాళమునుండి బర్మా స్క్వాడ్రను ఏర్పాటుచేయబడినది. ఈ స్క్వాడ్రనుకుజెందిన వైమానికులును ఫ యింగు హరికేన్సులును (ఒకతరహా విమానములు) 30 కి ఎక్కువగానే శత్రువిమానములను కూల్చివేసినవి. ఈ స్క్వాడ్రను అధిపతియైన ఆర్. ఆర్. స్టాఫర్డుటక్‌గారు 26 జర్మను విమానములను హతమార్చిరి. ఈ “ బర్మా ” స్క్వాడ్రను, ఇంగ్లాండుమీదికి వచ్చిన మొదటి ఇటాలియను విమానమును కూల్చివేసినది.

కా, ఇరాను, ఇరాకు, చివరకు రషియా, అట్లాంటికు యుద్ధరంగాలుగూడ ఇండియా రక్షణస్థానాలే యనవచ్చును. నేటికాలం యుద్ధంలో ఏదేశంకూడ తన ఆఖరు రక్షణశ్రేణివరకు యుద్ధం రావాలని వేచియుండరాదు. ప్రథమ రక్షణశ్రేణిని దిట్టపరచుకోవాలి. ఇండియాకు ప్రథమ రక్షణశ్రేణి అనేకవేలమైళ్లదూరాన యుంది. అని గవర్నరుగారు తెలిపిరి.

మదరాసురాష్ట్ర ప్రజలు యుద్ధసహాయానికి విశేషంగా ధనమిచ్చియు, యితరవిధములను సహాయంచేయుచున్నందుకు అభినందించి, యీదేశంపై బాంబులుపడినా ప్రజలు ధైర్యం చెడకుండాయుండేలాగు ప్రచారంజరగాలనిరి. ఈ ఉపన్యాసం విన్నవారంతా తమ చేరువనుండు ప్రజలకు యుద్ధంగూర్చి నిజం తెల్పుచు, కిట్టనివారు వ్యాపింపజేయు వదంతులు నమ్మరాదని చెప్పవలెను. జర్మను రేడియోలను వినరాదు. బ్రిటిషు రేడియోనే వినుచుండవలెననిరి.

“ ఇంగ్లాండు తనకొరకే యుద్ధంలో దిగలేదు. మీకొరకు, జర్మనీ ఆక్రమించిన దేశాల రక్షించుటకొరకే యీ యుద్ధంలో దిగింది. ఎన్నాళ్లయినా ఇంగ్లాండు జయించక తప్పదు. రషియా సైన్యమంతా మన పక్షంవుంది. అమెరికా పరిశ్రమలన్నింటి సహాయంగలదు. బ్రిటిషు సామ్రాజ్యమంతటి సహాయంగలదు. కావున విజయం తప్పదు. ఈ విజయం చేకూరే వరకు మదరాసు ప్రజలు అన్నివిధముల సహాయంచేయాలి. విజయంచేకూరిన పిదప ప్రతివాడును “ నా బిడ్డల శ్రేయమునకు, బిడ్డల బిడ్డల శ్రేయముకొరకును నా యథాశక్తి సహాయంచేయగల్గితిని ” అని గర్వంగా చెప్పుకో గల్గియుండాలి ! అని గవర్నరుగారనిరి.

### విజయంకొరకు ‘ వి ’— గుర్తు ప్రయోజనం.

మదరాసు గవర్నరుగారు యుద్ధం రెండవ వార్షిక దినమునాడు రాష్ట్ర ప్రజలకు ప్రత్యేక సందేశమును ప్రకటించిరి.

“ జర్మనీకి వశమయి కష్టాలుపడుచున్న దేశాలవారంతా పరాధీనత తొలగే శుభదినంకోసం ఎదురుచూస్తున్నారు. వారి విశ్వాసము “ వి ” గుర్తు తగిలించుకునే ప్రచారంలో స్పష్టమగుచున్నది. ఈ గుర్తు యిపుడు యితర దేశాలకు గూడ వ్యాపించినది. ఆక్రమిత దేశాలయెడ సానుభూతి చిహ్నముగను నాజీ క్రూరత్వంనుండి ఆక్రమిత దేశాలను కాపాడాలనే దీక్షకు చిహ్నంగాను “ వి ” గుర్తు వాడబడుచున్నది. మదరాసులోగూడ యీ గుర్తు వాడబడుచున్నది. యుద్ధంనిమిత్తం ధనమును సైనికులను సమకూర్చడంలో మిక్కిలి ప్రశంసనీయంగా మదరాసు ప్రజలు తోడ్పడుచున్నారు. ఈ సమయంలో యీ రాష్ట్రానికి గవర్నరుగానుండినందుకు నేను మరింత గర్వపడుచున్నాను. నాకు తోడ్పడిన ప్రజలందరికీ కృతజ్ఞుడను. ఈ రెండవ వార్షిక దినమున యిదివరకన్న ఎక్కువ కృషిచేయడానికి నిశ్చయించేసుకోవాలి. అందుచే మీ కృషి వెనుకబడక మరీమరీ ఎక్కువగునని నమ్ముచున్నాను.

భారతీయ సేనలు మన దేశపు దూరపురక్షణశ్రేణులందు అతి ధైర్యంగా పోరాడి విజయంపొందినందున యుద్ధంయొక్క ప్రత్యక్షబాధలు ఇండియాకు కలుగలేదు. అందుకు సంతసించుచున్నాము. కాని ప్రమాదం పూర్తిగ తొలగిపోలేదు, క్రొత్త పద్ధతులలో క్రొత్త ప్రాంతాలకు వ్యాపింపనున్నది.

ప్రత్యక్షంగా యుద్ధం జరుగుచున్నచోట కష్టపడుచున్న సోల్జరులు, సిపాయీలు, సివిలు ప్రజలకు ఆశాభంగం కలిగింపకుందుము గాక. వైస్రాయిగారు చెప్పినట్లు సంపూర్ణ విజయం చేకూరిననాడు, ‘ వి ’ గుర్తు విస్తరించి “ విజయము ” అని పూర్తిగ పలుకగల్గుటకు సర్వవిధముల తోడ్పడెదము గాక. ” అని గవర్నరుగారు సందేశమొసంగిరి.

# ఈ వారంలో యుద్ధ వార్తలు.

## విమాన దాడులు.

ఆగస్టు 27 వ తేది రాత్రి బ్రిటిషు విమానములు, జర్మనీ పశ్చిమ భాగమునగల 'మెన్‌హైం' అను పెద్ద పారిశ్రామిక పట్టణముపై పెద్ద దాడిని జరిపెను. జర్మనీయందలి ఇతర చిన్న పట్టణములపైనను, బులోన్, ఓస్టెండు మొదలగు రేవుల మీదనుగూడ చాల బాంబులు వర్షించినవి. బ్రిటిషు విమానములలో నొక్కటియు నష్టముగాకుండ అన్నియు తిరిగి వచ్చెను. గురువారము రాత్రి ఈ విమానములు తిరిగి, జర్మనీయందు యుద్ధ యంత్రాలయములు విశేషముగ గల డ్యుయస్‌బర్గు మొదలగు పట్టణములమీద పెద్ద దాడుల సాగించి వేలకొలది బాంబుల వర్షించెను. ఈ దాడులలో జర్మనీపై ఆకాశమున జరిగిన పోరాటములయందు 10 బ్రిటిషు విమానములు నష్టమయ్యెను. అవి 10 జర్మను విమానములనుగూడ పడగొట్టెను. 29 వ తేది రాత్రి వాతావరణము బాగుగ లేకున్నను వందలకొలది బ్రిటిషు విమానములు మరల మాన్‌హైం, ఫ్రాంకుఫర్టు మొదలగు జర్మన్ పారిశ్రామిక పట్టణములపైకి జని వేలకొలది బాంబుల వేసి చాల ఫ్యాక్టరీల ధ్వంసమొనర్చెను. ఈ దాడులనుండి 5 విమానములు తిరిగి రాలేదు. ఆరోజు పగలు ఫ్రాంసునందు జర్మనులు ఆక్రమించియున్న ప్రదేశముపైకి పెద్ద దాడుల సాగించెను. ఈ దాడులలో 10 బ్రిటిషు విమానములు నష్టమైనవి. 10 జర్మను విమానములుగూడ పడగొట్టబడెను. 30 వ తేది రాత్రి ఫ్రాన్సు తీరమునందలి షెర్బర్గు మొదలగు రేవులపై దాడులు సాగింపబడెను. 31 వ తేదిన ఉదయమునుండి సాయంత్రమువరకునుగూడ వందలకొలది బ్రిటిషు విమానములు, ఫ్రాన్సు ఉత్తర భాగముపైకి, అలలు అలలుగా వెడలి, అచటనున్న జర్మను విమానాశ్రయములపైనను, రేవు పట్టణములపైనను వేలకొలది బాంబులతో అగ్నివర్షముగురిపించి అపారమగు నష్టము గల్గించెను. శత్రువిమానములు అచటచట కనుపించినను, పోరాటమునకు రాక, తప్పించుకొనుచు వచ్చెను. అమెరికానుండి వచ్చిన "ఎగిరెడి కోటలు" అను పెద్ద విమానములు జర్మనిపై దాడులలో పాల్గొనెను. 31 వ తేదిన రష్యను విమానములుగూడ జర్మను రాజధానియగు బర్లిను నగరముపైనను డాన్జిగు, కోనిస్‌బర్గు పట్టణములపైనను దాడులు జరిపి బాంబుల వర్షించెను. జర్మనీపై మబ్బులు దట్టముగ వ్యాపించియున్ననుగూడ బ్రిటిషు విమానములు, జర్మనీలో పారిశ్రామిక పట్టణములు విశేషముగ గల రూరు, రైను ప్రాంతముల పెద్ద దాడుల సాగించెను. నాటి దాడులలో రెండు బ్రిటిషు విమానములు నష్టమయ్యెను.

గత రెండు సంవత్సరములలో 8,020 శత్రు విమానములు ధ్వంసమొనర్పబడెను. అవిగాక గత రెండు మాసములలో 4000 జర్మను విమానములు రష్యా పోరాటమున పడగొట్టబడెను.

సోమవారం రాత్రి, కొలోను (జర్మనీ) నందలి ఫ్యాక్టరీలపైన మరల బాంబులు వర్షింపబడెను.

2 వ తేదిన జర్మనీ రాజధానియగు బెర్లినుపైనను, ఫ్రాంకుఫర్టు అను పారిశ్రామిక పట్టణముపైనను భయంకరమగు దాడి జరిపెను. వందలకొలది విమానము లీదాడిలో పాల్గొనెను. ఇంతభీకరమగు దాడి ఇదివరకెన్నడును కని విని యుండలేదని, తటస్థ దేశీయులు నుడివిరి.

ఆగస్టు మాసమున బ్రిటనుపైన శత్రువులు 15 విమానముల గోల్పోయిరి. బ్రిటిషు విమానము లెవ్వియు నష్టపడలేదు. ఐరోపా భూభాగముల పై దాడులలో జర్మనులు 127 విమానముల గోల్పోయిరి. 265 బ్రిటిషు విమానములు నష్టమయ్యెను. మధ్య ప్రాచ్యమున 50 జర్మను విమానములు, 26 బ్రిటిషు విమానములు నష్టమైనవి.

ఆగస్టు 27 వ తేది రాత్రి, కొలది శత్రు విమానములు మాత్రమే బ్రిటిషు తూర్పుతీరపు పట్టణములపై దాడి సాగించెను. వానిలో నొకటి ధ్వంసమొనర్పబడెను. శత్రు బాంబులవలన ప్రాణములకుగాని, ఆస్తికిగాని యెట్టి నష్టమును గలుగలేదు. 28 వ తేదిన గూడ శత్రు విమానములు అధికముగ వచ్చియుండలేదు. కాని బాంబులవలన తూర్పు తీరమునందొకచోట స్వల్పముగా నష్టముగల్గెను. 29 వ తేది రాత్రి బ్రిటిషు తూర్పుతీరమున రెండు ప్రదేశములలో మాత్రము బాంబులు పడెను. అవి ఏవిధమగు నష్టమును కల్గింపకపోయెను. ఒక శత్రు విమానము పడగొట్టబడెను. 30 వ తేది రాత్రి బ్రిటను నైరుతిభాగమున, శత్రు బాంబులచే స్వల్పముగ నష్టముగల్గెను. 31 వ తేది రాత్రి, ఇదివరకు కంటె చాల శత్రువిమానములు బ్రిటనుపై దండెత్తివచ్చి, చాల ప్రాంతములలో వందలకొలది బాంబులు వర్షించెను. అందును, బ్రిటను ఈశాన్యభాగమునగల హల్లు అను గొప్ప పారిశ్రామిక రేవు పట్టణముపై, వేలకొలది పెద్దపెద్ద ప్రేలుడు బాంబులు వర్షింపబడెను. ఆస్తికి చాల నష్టముకల్గినది. కొందరు ప్రజలు మరణించిరి. ఒక 'షెల్టరు' (విమాన దాడుల సమయమున దాగుకొనుటకు గుహలు) పైనూటిగా ఒక బాంబుపడుటచే చాలమంది స్త్రీలు బాలురు హతులైరి. జూలై మాసమున లండనునగరముపైన ఒక్కమారైన శత్రు విమానములు దాడి సలుపుటకు వచ్చియుండలేదు.

సెప్టంబరు 1 వ తేది రాత్రి శత్రు విమానాలు చాల ప్రాంతములలో బాంబులు వేసెను. కాని ఇంగ్లండు ఈశాన్యభాగమున మాత్రమే విశేషముగ నష్టముగల్గెను. 2 వ తేదిన తూర్పు తీరపు పట్టణములపైన స్వల్పముగ దాడి జరిగెను. కాని యెచటను ప్రాణనష్టము గలుగలేదు.

## ఇటలీ-ఆఫ్రికా-మధ్యధరా.

ఇటలీ నియంతయగు ముస్సొలోనీ, రష్యా యుద్ధరంగము నందున్న హిట్లరును కలసుకొనెను. 25—29 వ తేదులలో వారు పలువిషయముల సంప్రదించుకొనిరనియు దెలుపబడెను. వీరు శీతకాలమున ఆఫ్రికాయందును, మధ్య ప్రాచ్యదేశము లందును సాగింపవలసిన యుద్ధ సన్నాహముల గురించి సంప్రదించుకొనియుందురని తలచుచున్నారు.

ముడిపదార్థముల సప్లయి కాక ఇటాలీ నౌకా నిర్మాణ శాలలలో పని నిలచిపోయినదని దెలియుచున్నది.

29 వ తేదిన టూబ్రూకు (లిబియా - ఉత్తర ఆఫ్రికా) రేవు దుర్గముపై శత్రువులు ఫిరంగులను, విమానములను ఉపయోగించుచు, వెలుపలి ప్రాకారముల పట్టుకొనవలెనని ప్రయత్నించిరి. కాని అందున్న బ్రిటిషు సేనలు వాని నన్నిటిని తిరుగగొట్టెను. ఇటలీ - జర్మను సైన్యములు అయిదు నెలలుగా ముట్టడించియున్నను, టూబ్రూకు దుర్గమునందలి బ్రిటిషు సైన్య మేమాత్రము చెక్కుచెదరలేదు.

సెప్టంబరు 2 వ తేదిన బ్రిటిషు గస్తీదళములు, శత్రు శిఖరములపైబడి అగ్రభాగములను ఆక్రమించెను.

29 వ తేది రాత్రి బ్రిటిషు విమానములు ట్రిపోలి (ఇటాలియను ఉత్తర ఆఫ్రికా) రేవుపై భయంకరమగు దాడి జరిపి 25 టన్నుల బాంబులను వేసెను. రేవునందున్న 8000 టన్నుల నౌకయొకటి 5,000 టన్నుల నౌకయొకటి అగ్నిజ్వాలలచే ధ్వంసమై పోయెను. ఆరోజున బెంఘాజీ రేవుపైన గూడ పెద్దదాడులు సాగింపబడెను.

గత 28 వ తేదిన శత్రువిమానములు, సూయజు కాలువ ప్రాంతముపై దాడి జరిపెను. 11 గురు ప్రజలు మరణించిరి.

30 మందికి గాయములు తగిలెను. ఆస్తికి మాత్రము యెక్కువ నష్టము గలుగలేదు. మాల్టా, సైప్రెస్ దీవులపైన గూడ శత్రువిమానములు వచ్చెను గాని యెక్కువ నష్టము గల్గింపలేకపోయెను. సైప్రెస్‌పై ఒక శత్రువిమానము పడగొట్టబడెను. 31 వ తేదిన పరల సూయజుకాలువ ప్రాంతముపైనను, ఈజిప్టునందలి బ్రిటిషు నౌకా కేంద్రమగు అలెగ్జాండ్రియా రేవుపట్టణముపైనను శత్రువిమానములు దాడి జరిపెను. అలెగ్జాండ్రియాలో ఇద్దరు మరణించిరి. 43 గురకు గాయము తగిలెను. ఆస్తికి మాత్ర మెక్కువ నష్టము గలుగలేదు.

## టర్కీ-ఈరాక్-ఈరాన్.

జర్మనీకి అనుకూలమగు ఈరాన్ ప్రభుత్వ మంత్రివర్గము 27 వ తేదిన రాజీనామా నొసగెను. అలీ ఫరూగీగారి నాయకత్వమున కొత్త మంత్రివర్గ మేర్పడెను. కొత్త మంత్రివర్గము, ఆంగ్ల - రష్యను సైన్యములతో యుద్ధము మానవలసినదని వెంటనే ఈరాన్ సైన్యములకు ఉత్తరువు గావించెను. 28 వ తేదిన ఈరాన్ పార్లమెంటు సమావేశమై కొత్త మంత్రివర్గమున ఏకగ్రీవముగ సంపూర్ణ విశ్వాసమును ప్రకటించెను. ఫరూగీగారు 1932-35 వ సంవత్సరములలో ప్రధానమంత్రిగ నుండెను.

సెప్టెంబరు 1 వ తేదికి మిత్రమండలి సైన్యములు తమకు కావలసిన ప్రాంతముల నాక్రమించుకొని పురోగమును నిలిపివేసిరి.

ఈరాన్‌నందలి జర్మనులలో చాలభాగము, ఈలోపుననే టర్కీకి పారిపోయిరి. మిగిలినవారు కొందరు టెహరన్‌లోని జర్మను రాయబారి కార్యాలయమున ఆశ్రయముల నేర్పరుచుకొనిరి.

రాజధానియగు టెహరన్ నగరమున—ప్రజలు భయపడి పారిపోవుచుండుటచే—అధికారిలు సైనికశాసనమును అమలులోనికి దెచ్చిరి.

టర్కీ పడమటి సరిహద్దులయందు గ్రీసు, బల్గేరియాలలో జర్మనులు, ఇటాలియనులు తమ సైన్యమును హెచ్చించిరనియు ఇపుడచట మూడులక్షల సైన్యము కేంద్రీకరింపబడియున్నదనియు రష్యనులు ప్రకటించుచున్నారు. ఆక్సిసు సైన్యములు టర్కీపై కొలది రోజులలోనే దాడి సాగింపనున్నవని రష్యాయందును, టర్కీయందును వదంతులు బలముగ నున్నవి.

సిరియా యుద్ధమున ఖైదీలుగ పట్టుకొనబడిన బ్రిటిషు సైనికోద్యోగులను, ఫ్రెంచి అధికారులు తిరిగి బైరూటుకు (సిరియా) పంపి బ్రిటిషు అధికారులకు అప్పగించిరి.

సిరియాయందలి స్వతంత్ర ఫ్రెంచి ప్రధానాధికారియగు కాట్రూ సేనాని 27 వ తేదిన డమాస్కసు నగరమునకు వచ్చి సిరియాకు స్వతంత్ర ప్రభుత్వము నేర్పరచుటకు తాము గావించిన వాగ్దానము నమలు జరుపుటకు మార్గమును అన్వేషించుటకుగాను వెనుక సిరియా శాసనసభాధ్యక్షుడుగ హూస్సించే అటాషిగారితో సంప్రదించిరి.

## రష్యా.

యుక్రేనియా రాష్ట్రమున నీపరు నది పడమటి తీరమున గల పెద్ద పారిశ్రామిక పట్టణమగు డినీప్రో-పెట్రోవిస్కు పట్టణమును తమ సైన్యములు ఖాళీచేసెననియు, అంతకు పూర్వము డినీపరు నదిపైగల పెద్ద ఆనకట్ట శత్రులచేతులలో బడకుండ మందు గనులు పెట్టి రష్యను సైన్యములే ధ్వంసమొనర్చెననియు 28 వ తేదీన రష్యను అధికారులు ప్రకటించిరి. ఒడెస్సా రేవు పట్టణమునమాత్ర మింకను పోరాటము సాగుచునేయున్నది. 2 వ తేదీన నాజీ సైన్యములు, ఆ నగరమునకు వెలుపలనున్న నీటిసప్లై చెరువులను పట్టుకొనినటుల ప్రకటించిరి. డినీపరు నదికి పడమటిభాగమునంతను ఖాళీచేసి తూర్పు తీరమునకు మరలిపోయిన రష్యను సైన్యములు పడమటి తీరమునందలి జర్మను సైన్యములపై తిరుగు దాడుల సాగించుచుండెనని జర్మనులే అంగీకరించిరి.

మధ్యరంగమున మార్షలు టిమోషింకో సేనాని సైన్యములు (రష్యను) జర్మనులపై తిరుగ దాడులసాగించి, గోమెలు నగరమును తిరిగి స్వాధీనపరచుకొనినటుల 30 వ తేదీన రష్యనులు ప్రకటించిరి. జర్మనులు 30 మైళ్లు వెనుకకు కొట్టబడిరని 3 వ తేదీన రష్యనులు ప్రకటించిరి. ఈ రంగమున నింకను చాల భయంకరమగు పోరాటము జరుగుచున్నది. గోమెలు నగరమునుండి ఆగ్నేయమూలగ తమ సైన్యములు మరి 40 మైళ్ళ దూరము సాగిపోయినటుల జర్మను అధికారులు తెలుపుచున్నారు.

ఉత్తరరంగమున ఎస్తోనియాలో ముఖ్యమగు రేవు పట్టణమగు టాలిను నగరమును ఖాళీచేసితిమని 2 వ తేదీన రష్యను అధికారు లంగీకరించిరి. తమ సైన్యములు లెనిన్‌గ్రాడు రేవు పట్టణపు వెలుపలి ప్రాకారముల సమీపించి భేదించెనని 3 వ తేదీన జర్మను అధికారులు ప్రకటించిరి. లెనిన్‌గ్రాడు రక్షణకు అతి భయంకరమగు పోరాటము సాగుచున్నది. జర్మనులు, లెనిన్‌గ్రాడునకు 15 మైళ్లలోపలికి రాలేదని రష్యనులు 3 వ తేదీన ప్రకటించిరి.

ఫిన్లండు సరిహద్దులందు, ఫిన్నిషు అధికారులు, తమ సైన్యములు విబర్గు నగరమును పట్టుకొన్నవనియు, అచటనుండి తమ సైన్యములు కెరిలియను భూసంధిమీదుగ లెనిన్‌గ్రాడు వైపుకు నడచుచున్నవనియు, మరికొన్ని సైన్యములు మాస్కోనుండి ఆర్కిటికు తీరమున రష్యను రేవగు మర్మనిస్కు పట్టణమునకుగల రైలు మార్గమును పలుచోట్ల భేదించెననియు, ప్రకటించుచున్నారు. కాని రష్యను అధికారు లీప్రకటనల నంగీకరించుట లేదు.

ఫిన్లండుకు యుద్ధంలోగల్గిన నష్టములవలన దిగులుపడి రష్యాతో సంధి రాయబారముల సాగించుచుండిరను వదంతులు నిరాధారములని ఫిన్లండు అధికారులు ప్రకటించిరి.

రష్యా రంగములలో ఇంతవరకు 25 లక్షల జర్మను సైన్యము నష్టమై యుండుననియు అందు 10 లక్షలు మరణించిరనియు 15 లక్షలు క్షతగాత్రులనియు రష్యను అధికారులు తెలుపుచున్నారు.

## అమెరికా-అట్లాంటిక్.

అమెరికా సంయుక్త రాష్ట్రములలో ఫాక్టరీలు, సివిలు ప్రజల ఆర్డరులను వెనుక బెట్టియైనాసరే—ముందు బ్రిటను, రష్యా, చైనాలకు కావలసిన ఆయుధ సామగ్రిని తయారుచేసి పంపవలెనని సంయుక్తరాష్ట్ర అధికారులు 28 వ తేదీన ఉత్తరువును ప్రకటించిరి.

కార్మికు లందరును సంపూర్ణోత్సాహముతో ఫాక్టరీలలో పనిచేసి ప్రజాప్రాతినిధ్య రాజ్యముల కవసరమగు ఆయుధ సామగ్రిని త్వరితముగ సిద్ధమొనర్చి యొసగవలెనని కార్మిక సంఘాధ్యక్షుడగు గ్రీన్సుగారు ప్రకటించిరి.

## దూరప్రాచ్య దేశములు.

అమెరికా సంయుక్త రాష్ట్రములందు జపాను రాయబారియగు అడ్మిరల్ నమురాగారు రూజ్వెల్టు అధ్యక్షుని కలుసుకొని జపాను ప్రధానియగు కొనోయి రాకుమారుడు రూజ్వెల్టునకు వ్యక్తిగతముగ వ్రాసిన జాబును అందజేసెను. పిమ్మట నమురాగారు రూజ్వెల్టు చాలసేపు సంప్రదించిరి. కొనోయి రాకుమారు డాజాబునందు జపాను సంయుక్తరాష్ట్రములకు గల వివాదాంశములను వివరించి వానిని సౌమ్యముగ పరిష్కరించు మార్గములను చర్చించెను. జపానుకు అమెరికా సంయుక్త రాష్ట్రములకును సమాధానము కుదిరినదని జర్మను రేడియో ప్రకటించెను. ఇంకా కుదరలేదనియు, ఇంకా

సంప్రదింపుల దశయందే యున్నదనియు జపాను అధికారులును సంయుక్తరాష్ట్ర దేశీయాంగ కార్యదర్శి హల్లుగారును 30 వ తేదిన ప్రకటించిరి.

29 వ తేదిన జపాను చక్రవర్తి ప్రధానమంత్రిని సైనిక, పారిశ్రామిక మంత్రులను పిలిచి మాటలాడెను. ఆ రోజుననే ఒక కోటిమంది కార్మికులను పోగుచేసి వారందరిని నిర్బంధముగ పరిశ్రమలలో పనిచేయించుటకు ఉత్తరువు గావింపబడెను. ఈ ఉత్తరవుప్రకారము దేశమునం దెవరును పని చేయకుండ వూరక కూర్చొనుటకు వీలులేదు.

తాయి ప్రభుత్వపు కొత్త విదేశాంగ మంత్రియగు నెడరెక్ చిన్నాన్‌గారు పత్రికా ప్రతినిధులతో 27 వ తేదిన మాటలాడుచు తాయి ప్రభుత్వ మన్ని దేశములతోను స్నేహముగ నుండుటయే తమ ప్రధానాశయమని ప్రకటించెను. 29 వ తేదిన తాయి ప్రభుత్వము విదేశముల కనుకూలముగ ప్రచార మొనర్చువారికి కఠిన శిక్షల ప్రకటించుచు నొక శాసనమును ప్రకటించెను.

తాయి ప్రభుత్వపు బ్యాంకు జపానుదేశపు యోకొహామాస్పీసీ బ్యాంకునకు బంగారు తణఖామీద 25 లక్షల పౌనులను ఋణమొసగుటకు ఒడంబడిక గావించుకొనెనని 28 వ తేదిన ప్రకటించబడెను.

జపానునందును, మంచుకో, జపానుచే ఆక్రమింపబడిన ఉత్తర చైనా రాష్ట్రములు ప్రాంతమునుండియు, బ్రిటిషు పౌరులందరు వెంటనే తిరిగి వచ్చివేయవలెనని బ్రిటిషు అధికారులు సలహాయొసగిరి.

డచ్చి ఇండీసు దీవుల అధికారులు తమ పరిపాలనక్రింద ప్రదేశములలో ప్రతిపౌరుడును సైన్యమున జేరి సైనిక శిక్షణ పొంది తీరవలెనని ఉత్తరువులు గావించిరి.

చైనా సైన్యములు, ఆకస్మికముగ చెకియాంగ్, ఫూకియను ఆనహ్వే, కియాంగ్సూ రాష్ట్రములలో శత్రు శిబిరములపైబడి ఫూచింగ్, కోపక్ పట్టణముల నాక్రమించెను.

28 వ తేదిన ఫ్రెంచి సైన్యములు, ఇండో-చైనా సరిహద్దులదాటి చైనాలోని పాన్సీ అను పట్టణముపై దాడి జరిపి చాల నష్టము గల్గించెను. ఈ చర్యను తీవ్రముగ ఆక్షేపించుచు చైనా ప్రభుత్వము ఫ్రెంచి అధికారులను హెచ్చరించెను.

## విషీ.

మాజీ ఫ్రెంచి ప్రధానియు, జర్మనీతో సహకార మొనర్పవలెనను ఫ్రెంచివారికి నాయకుడును అగు ఎం. లావెలుగారికిని, మార్సెలు డీటుగారికిని - వర్సైయిల్సు వైద్యశాలయందు శస్త్రచికిత్స గావింపబడెను. వారి శరీరములనుండి రివాల్వరుగుండు తీసివేయబడెను. వారు కోలుకొనుచున్నారు. వారిపై రివాల్వరు ప్రేల్చి హత్య చేయుటకు ప్రయత్నించిన యువకుడు పట్టుకొని విచారింపబడుచున్నాడు. అతని వయస్సు 21 సంవత్సరములు. జర్మనీతో సహకారవాదులలో నెవరినైన చంపదలచి వచ్చితినని యతడు నేరము నంగీకరించెను.

జర్మనీతో - తుది సంధిని కుదుర్చుకొనుటకుగాను, విషీ ఉపప్రధానియగు అడ్మిరల్ డార్లన్‌గారు తరుచు పారిసు నగరమునకు జని అచటి జర్మను అధికారులతో రాయబారములు సాగించుచున్నాడు. కాని జర్మను అధికారులు, విషీ ప్రభుత్వము ఆక్సిసుతో కలిసి బ్రిటనుపై దాడిసాగించిననే దప్ప ప్రస్తుతము సంధిసాధ్యము గాదని తెలుపుచున్నారు.

ఫ్రాన్సులో యూదులికమీద రేడియో సెట్టులనుంచుకొనరాదనియు, 21 వ సం॥ లోపు వయస్సుగలవారికి, హోటలులయందు సారాయముల విక్రయింపరాదనియు, 2 వ తేదిన విషీ ప్రభుత్వము రెండు యుత్తరువుల జారీచేసెను.

## ఆక్రమిత ప్రాంతములు.

అల్సను (ఆక్రమిత ఫ్రాన్సు) జిల్లాయందు జర్మనులు ఆగస్టు 27 వ తేదినుండియు స్వపరిపాలనా సంస్థల రద్దుజేసి, నియంతృత్వ పద్ధతులను ప్రవేశపెట్టిరి.

నాజీ నాయకుల కోరికపైన, యుగోస్లావియాలో వెనుక మంత్రిగనున్న జెనరలు నెడిచ్‌గారి నాయకత్వమున కొత్తగా ప్రత్యేక సర్వియా ప్రభుత్వము నేర్పరచిరి.

యుగోస్లావియాలో, సెరాజెవో - బ్రాడ్ రైలు మార్గమును, సర్వియను తిరుగబాటుదారులు పలుచోట్ల ధ్వంసమొనర్చిరి. వారి అల్లరిని అణగగొట్టుటకు క్రోషియానుండి సైన్యములు పంపబడెను.

బల్గేరియాలో జర్మను ఆక్రమణను గురించి ప్రజలలో చాల అలజడి వ్యాపించియున్నది. ప్రజలేసమయమున తిరుగబాటు ప్రారంభమగునోయని అధికారులు భయపడుచున్నారు.

## తటస్థ దేశములు.

అర్జెంటైనా (దక్షిణ అమెరికా) ప్రభుత్వమువారి సొలిసిటరు జనరలు, ఆదేశమునందలి నాజీనాయకులపైన కోర్టులో క్రిమినలు కేసుల పెట్టెను.

దక్షిణ అమెరికాయందున్న 21 ప్రజాస్వామ్య ప్రభుత్వములును తమతమ రేవులందు చాలకాలముగ నిలచియున్న విదేశీయ నౌకలను స్వాధీనపరచుకొని ఉపయోగించుకొనుటకు నిశ్చయించినవి. జర్మనీ-ఇటలీల తాలూకు సుమారు 100 నౌకలు, ప్రస్తుతము దక్షిణ అమెరికా రాష్ట్రములందున్నవి.

## నౌకా నష్టములు.

ఆగస్టు 29 వ తేదిన బ్రిటిషు కోస్తా విమానములు ఉత్తర సముద్రమున శత్రు నౌకల నెదిర్చి వానిలో రెంటిని ముంచివేసెను.

సెప్టంబరు 2 వ తేదిన బ్రిటిషు విమానములు డంకర్కు రేవుపై దాడి సల్పినపుడు, మరియొక సప్లై నౌకపై బాంబులువేసి ధ్వంసమొనర్చెను.

జర్మనులిటీవల మిత్రమండలి నౌకలపై సాగించుచున్న సముద్ర యుద్ధములందు 200 జలాంతర్గాముల నుపయోగించుచున్నట్లు తెలియుచున్నది.

లిబియా తీరమున సప్లైలను కొనిపోవుచున్న శత్రు నౌకల జట్టును 2 వ తేదిన బ్రిటిషు విమానము లెదిర్చి వానిలో రెంటిని ముంచివేసెను.

---

సలహా: ఇకముందు చూచుకొనుటకు యీ మదరాసు యుద్ధ సంచికను మీరు భద్రపరచుకొనుడు.

[మదరాసు సమాచారముల డైరెక్టరుగారు తమ వందనములతో దీనిని మీకు పంపుచున్నారు.]

MADRAS : PRINTED BY THE SUPERINTENDENT, GOVERNMENT PRESS.